Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ ఆగస్టు నెల 1 వ తేదీ శుక్రవారం [నె 20 రు

## దూరప్రాచ్యమున యుద్ధమేఘాలు

### ఇండో-చీనాలో జపాను సేనలు ప్రవేశించుట.

దూరప్రాచ్యమునందు పరిస్థితులు అతి త్వరగ మారిపోవుచున్నవి. విషీ—జపాను ఒడంబడికను జపాను ప్రీవీ కౌన్సిలు ఆమోదించినది. విషీ అధికారులు తాము లొంగిపోయిన విషయం చెప్పడానికి సిగ్గుపడుతున్నప్పటికి, తమ విమానాశ్రయాలు ఎనిమిదింటిని జపాను ఆక్రమించుట కనుమతించిరని వెల్లడయింది. ఇండో-చీనాలోని సైగాను, సీమరీపులుగూడ జపానువారు వాడుకొనుటకిచ్చిరి. సీమరీపు తాయి (సయాం) సరిహద్దునకు చేరువగఉంది. దక్షిణ-ఇండో చీనాలోనికి జపాను సేనలు ప్రవేశించినవి. కామ్రాబేలోనికి జపాను యుద్ధనౌకలువచ్చినవి. సైగానుపై జపాను బాంబరు విమానాలు ఎగిరినవి.

జపాను విదేశాంగ విధానము గత యిరువదేండులనుండి పరికించుచున్నవారికి యిది ఆశ్చర్యం కలిగించదు. గత సెప్టంబరులో ఇంగ్లాండుపై జర్మనీయుద్ధంలో గెలుస్తుందనుకొని జపాను అక్షరాజ్యాల ఒడంబడికలో చేరెను. పడమటను ఇంగ్లాండు యింకా యుద్ధంలో నిమగ్నమయి యుండగనే వెంటనే ఉత్తర ఇండో—చీనాయందు హానాయి, హైఫాంగు నగరములందు సైనిక ఆర్థిక సౌకర్యములను జపాను బలవంతంగా పొందెను. ఇపుడు రష్యా నాజీలతో పోరాడుచుండ యిదేసమయమని కష్టంలేకుండా మరికొంత లాభం పొందాలని చూస్తున్నది.

### ఇండియాకు వెంటనే ముప్పులేదు.

ఇండో—చీనాలో సైనిక కేంద్రములను జపాను స్థాపించుకొనుట ఇండియా బర్మాలకు ప్రత్యక్ష విరోధచర్యగాదు. ఇంకా తాయిలాండు జపాను బర్మాలకు మధ్యగలదు. తాయిలాండులోగూడ నౌకాశిబిరాలు, విమానదళ శిబిరాలను జపాను కోరినట్లు వార్తలు వస్తున్నాయి. దీనినిబట్టి ఇండో-చీనాను ఇంగ్లాండు ఆక్రమింపదలచిందని విషీ జపానులు చేయుచున్న ప్రచారం అసత్యమని స్పష్టముకాగలదు. తామాక్రమించుటకు ఏదోఒక సాకు చెప్పాలని యీ తప్పుడు ప్రచారం చేస్తున్నారు. ఇండో-చీనాను విషీ జపానులు కలసి సంరక్షిస్తాయన్నవాదముకూడ వట్టి బూటకమే.

### సిరియాతో పోలిక లేదు.

ఇండో-చీనా దూరప్రాచ్యపు సిరియా మాదిరిగా మారిపోగలదని జపాను పత్రికలు విమర్శించుచున్నవి. దానిని జపాను ఆక్రమించుటకు యిదోసాకుగ చెప్పబడినది కాని, సిరియాకు ఇండో - చీనాకు యెటువంటి సామ్యములేదు. జర్మనులు యెక్కడికిపోతే అక్కడకు వెంటబడి కొడతామని ఆదివరకు బ్రిటిషువారు విషీ ప్రభుత్వమునకు తెలిపియుండుటచేతను, సిరియాలో జర్మనులు ప్రవేశించుటేగాక, తామంగీకరించిన సంధిషరతులను వుల్లంఘించుటచేతను, సిరియాలో బ్రిటిషువారు సైన్యాలను దింపేరు. ఇండో-చీనాలో జర్మనులు లేనందున అక్కడకు బ్రిటిషువారు పోనవసరంలేదు. సిరియాలో జర్మనులకు విషీ ప్రభుత్వం లొంగిపోయి బ్రిటిషువారికి యెదురు తిరిగెను. ఇపుడు ఇండో - చీనాలో ప్రవేశించిన విషీ జపానుకి లొంగిపోయెను. కావున సిరియా, ఇండో-చీనాల వ్యవహారములకు వ్యత్యాసం లేకపోలేదు. దూరప్రాచ్యమున సులభంగా యుద్ధంలో దిగి గెలువవచ్చునని జపాను తలచినచో గొప్ప పొరబాటేయగును. పసిఫికు సముద్రంలో శాంతి కాపాడుటకు యెంత మనస్ఫూర్తిగ బ్రిటిషువారు కోరుచున్నా హాలిఫాక్సు ప్రభువుగారు చెప్పినట్లు తమకు నష్టంవచ్చే చర్యలు యితరులెవ్వరైన చేస్తూవుంటే సహించి వూరుకోరు.

### ఎ. బి. సి. డి. రక్షణ.

దూరప్రాచ్యమునందు ఎ. బి. సి. డి. దళము, అంటే అమెరికా, బ్రిటిషు, చీనా, డచియీస్టు ఇండీసు ప్రభుత్వ సేనలన్ని కలసి జపాను దుండగములను అణచివేయుటకు నిశ్చయించుకొనెను. జపానుపై ఆర్థికంగా ఒత్తిడి కల్గించుటకు యీ నాల్గు దేశాలు వెంటనే చర్య గైకొన్నవి. 1911 వ సంవత్సరములోని ఇంగ్లాండు-జపాను ఒడంబడిక, 1934 వ సంవత్సరం ఇండియా-జపాను వాణిజ్య ఒడంబడిక, 1937 వ సంవత్సరం బర్మా-జపాను వాణిజ్య ఒడంబడిక లన్నింటిని రద్దుచేయగోరుచూ బ్రిటిషు ప్రభుత్వం జపానుకి నోటీసు యిచ్చెను. అంతేకాక అమెరికాతోపాటు ఇంగ్లాండుకూడ తన సామ్రాజ్యంలోనున్న జపాను దేశపు నగదు నిలువలన్నింటిని ఘనీభవింపచేసెను. అంతమాత్రాన జపానుకి యెక్కువ నష్టంకలుగదు. ఏమంటే యిందుకు ప్రతిగా జపానులోనున్న అమెరికా బ్రిటనుల నగదును జపాను ఘనీభవింపజేసెను. అమెరికాలో జపాను ఆస్తి 1,310 లక్షల డాలరులే. జపానులోనున్న అమెరికా ఆస్తి 21,700 లక్షల డాలరులు. కాని యీ ఆస్తులు ఘనీభవించడంవలన జపానుకు ప్రాణప్రదమగు యెగుమతి దిగుమతి వ్యాపారం నిలచిపోవును. “యను” నాణెము చెల్లుబడియగు మంచుకో-కొరియా దేశములతో మాత్రమే జపాను వ్యాపారము చేయవలసియుండును. జపాను ఆక్రమించిన చీనా ప్రాంతములద్వారా దొంగవ్యాపారంచేసి జపాను లాభంపొందకుండ చేయుటకై, చీనా ఆస్తులనుగూడ ఘనీభవింపజేయవలెనని మార్షలు జంగుకాయి షేకుగారు మిత్రమండలి ప్రభుత్వములను కోరెను. చుంగుకింగు చీనా ప్రభుత్వ వ్యాపారమునకు మాత్రం మినహాయింపు లోసంగబడును. ఇతర చీనాప్రాంతములద్వారా జపాను విదేశాలతో వ్యాపారం చేయుటకు వీలుండదు.

ఎ. బి. సి. డి. రక్షణ దళము చేయవలసిన సైనిక చర్యలన్నియు చేసెను. బ్రిటిషు కామన్సుసభలో విదేశాంగ

మంత్రి ఈడెనుగారు యిట్లు చెప్పిరి :—"జపాను చర్యలు దూరప్రాచ్యమున బ్రిటిషురాజ్యాలకు వాటి హక్కులకు ముప్పుతెచ్చిపెట్టునవిగా బ్రిటిషుప్రభుత్వం ఎంచుచున్నది. అందుకనే ముందునుండియు మేము అమెరికా ప్రభుత్వంతోను, అధినివేశ ప్రభుత్వములతోను సంప్రదించుచునే యున్నాము. రానున్న ముప్పును వారించుటకేమి చర్యలు గైకొంటిమో మున్ముందు చెప్పెదను. మలయాలో అప్పుడే తగు చర్యగైకొనబడినదనిమాత్రం యిపుడు చెప్పగలను." ఏమివచ్చినా సరే సిద్ధంగానున్నామని దూరప్రాచ్యసామ్రాజ్య సేనాధిపతియగు ఎయిరు చీఫ్ మార్షలు సర్ రాబర్టు బ్రూకు పాఫెముగారు చెప్పిరి.

అమెరికా ప్రభుత్వంకూడా చురుకుగా పనిచేస్తున్నది. అమెరికా పసిఫికు నౌకాదళము హవాయి దీవిలో పెరల్ హార్బరువిడచి ఎక్కడికో పయనమయ్యెను. ఫిలిప్పైను సైనిక దళములను అమెరికా సాయుధదళములుగా అధ్యక్షుడు రూజువెల్టుగారు చేర్చుకొనిరి. ఫిలిప్పైనులోని అమెరికా సైనికదళాధికారిగ జనరలు డగ్లసు మాకార్తీనుగారిని నియమించిరి. ఈతడదివరకు అమెరికా సర్వసేనాధికారిగ నుండెను. "దూరప్రాచ్యమునందు క్రొత్త సైనికదళం స్థాపించుటవలన అమెరికా అచట తన హక్కులను పూర్తిగ సంరక్షించుకొనుటకు ఎంత తెగింపేనా చేస్తున్నదని రుజువు కాగలదు" అని క్రొత్త సేనాధికారి ప్రకటించెను. జపానుపై సంయుక్త రాష్ట్రములు, యితర అమెరికా రాజ్యాలు గూడ ఆర్థిక దిగ్బంధ మొనరింపకోరుచున్నామని సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శి సమ్నరు వెల్సుగారు తెలిపిరి.

---

# ఇరిట్రియాలో ఇటలీపాలకుల దారుణ చర్యలు.

## బ్రిటీషువారి ఆక్రమణకు పూర్వ చరిత్ర.

ఒక జమేదారు వ్రాసిన లేఖ.

తూర్పు ఆఫ్రికాలో ఇటలీవారివగు రాజ్యభాగములను యిటీవల బ్రిటిషువా రాక్రమించిరి. ఇటలీ పాలనయందున్నపుడు దేశీయులను పాలకులు ఎట్టి హింసలుపెట్టిరో ఆ హింసలన్నియు తెలుపుచు ఇండియను మెడికలు డిపార్టుమెంటునందున్న బ్రిటిషు సైన్యములోని జమేదారు పూనాలో రిక్రుటుమెంటు ఆఫీసరుకి లేఖను వ్రాసెను. అందలి విషయములు యీ దిగువరీతి గలవు :—

ఇరిట్రియాలో అస్మర బ్రిటిషువారివశమై, మస్సావా యింకా పడిపోక ముందు మేము ముగ్గురం ఆఫీసరులము, 160 మంది జట్టువారు ఒక ప్రదేశమునకు పంపబడితిమి. అచట ఏప్రిల్ 6 వ తేది దిగితిమి. ఆచోటికి 30 మైళ్ల దూరంలో ఎక్కడ నీళ్లు లేవు. అది మస్సావాకు 58 మైళ్ల దూరం వుంది. స్టీమరులోనుండి సామాను అతివడిగా దించుకొంటిమి. స్టీమరులనుండే మంచినీళ్లు తెచ్చుకొంటిమి. మకామునకు 30 మైళ్లదూరమున నీటి వసతిగలచోట 80 మందిని అచట విడువవలసివచ్చెను. దినమునకు 1 గాలను నీరుమాత్రమే వస్తూవుండెను. నీటియొక్క విలువ నా కప్పుడే మొదటిసారి తెలిసెను. 9 వ తేదిన మస్సావా మనవశమైనట్లు శుభవార్త వచ్చెను. కాని సముద్రమార్గమున మందు గనులు నాటబడినవనియు, మన నావికులు వాటిని తొలగించుచున్నారనియు తెలిసెను. 13 వ తేదిన నీటివసతివద్దనున్న 80 మందిని తెచ్చుటకు నేను 5 మోటారు లారీలతో పోయితిని. త్రోవలో ఎక్కడ చెట్టునీడలేని ఎడారి.

"ఇంకా ఒకమైలు దూరంలో వారున్నారనగా, ఒక చిన్న గ్రామం ఇరిట్రియాదేశీయులున్నది అగుపడెను. లారీ నిలుపగానే, గ్రామస్తులందరు పారిపోయి యిండ్లలో దూరిరి. నేనొక గళాసు నీరడుగగ ఒకడు యిచ్చెను. వానికో సిగరెట్టు యిచ్చి, వచ్చీరాని అరబికు భాషలో ఎందు కలాగ పారిపోతున్నారని వానిని అడిగితిని. అతడు మా సేన చాల మంచిదనియు, ఇటలీ సేనలు గ్రామాలువైపు వస్తే ఇంత మర్యాదగానుండక, యిండ్లలోదూరి స్త్రీలను చెరచెదరనియు చెప్పెను. అందుకే అందరు పారిపోతున్నారనెను. నేనపుడా మాట నమ్మలేదు. కాని మస్సావా చేరినపిమ్మట నిజమని తెలిసెను. తాము పరిపాలించుచున్న ప్రజలయొక్క భార్యలను కుమార్తెలను ఏ నాగరిక జాతి సైనికుడు చెరచడని నే ననుకొంటిని. బ్రిటిషు సోల్జర్లు భారతీయ స్త్రీలను యిట్లు చెరచినట్లు నేను వినలేదు. అట్లా ఎవరేనా చేయ ప్రయత్నించిన కఠినశిక్ష విధించబడును. అందుచే ఆ వార్త నాకు ఆశ్చర్యం కలిగించెను.

### మస్సావాలో కథ.

20 వ తేదిన మేము మస్సావానగరం చేరితిమి. నగరంలో చాలమంది ఇటలీ దేశీయులగు ఖైదీలున్నారు. మాకు మంచి నీటివసతిగల బారకాసులో బసయిచ్చిరి. వీధులలో తిండిలేక బక్కచిక్కిన దేశీయులు తగిన గుడ్డలైన లేక తిరుగుచు అగుపడిరి. స్త్రీలు గూడ నడ్డికి రొమ్ముకు మాత్రం చాలీచాలని గుడ్డలు చుట్టుకొని తిరుగుచున్నారు. వారంతా నాగరికతలేని కొండజాతులవారని నేననుకొంటిని.

మాబస చేరువను కొందరు ఇటలీ సివిలు ప్రజలు పనులు చేసుకుంటున్నారు. అందొకడు కొద్దిగ ఇంగ్లీషు వచ్చినవాడు నాదగ్గరకువచ్చి బట్టలు అడిగెను. వానిని దేశీయుల స్థితిని గూర్చి అడుగగా, దేశీయుడెవడు అధికారుల అనుమతిలేనిది నగరంలోకి రాకూడదనియు, వస్తే ప్రేల్చి చంపుతారనియు చెప్పెను. అది నాకు విడ్డూరంగా తోచింది.

"నగరంలో దొరికిన వస్తువులలో చాల ఇటలీ సైనికుల సరకుగలదు. ఇరిట్రియాలో సైనికుల సామానులుకూడ ఉన్నాయి. వారికి బూట్లులేవు కొందరికి తుపాకులు లేవు. కొందరికి షర్టులు లేవు. ఇటలీ సైనికులు వాడే తుపాకులు మంచివి. ఇరిట్రియా సైనికులు వాడేవి 100 సం॥ క్రిందవి. సైన్యంలో ఆఫీసరు హొదాగల ఇరిట్రియనులే లేరు. 500 ఇరిట్రియా సైనికులు ఒక ఇటలీ ప్రైవేటు స్వాధీనమునందుండిరి. ఇండియా సైన్యానికి ఇరిట్రియా సైన్యానికి గల వ్యత్యాసం దీనిలోనే తెలుస్తున్నది.

ఒకనాడొక దేశీయుడు హిందూస్థానీ వచ్చినవాడు మా బసకు వచ్చెను. వాడికొకకన్ను లేదు. అతడొక హొటలు నౌకరు. యుద్ధంరాగానే అతనికో తుపాకియిచ్చి సైన్యంలో చేర్చెరు. ఒక ఇటలీ సార్జెంటు ఒకనాడు కోపంవచ్చి రాయి విసరికొట్టగా అతని ఎడమకన్ను పోయిందని అతడు చెప్పెను. ఇరిట్రియాలో ఇటలీ పాలకులు యింత నాగరికత నీతి ప్రదర్శించిరి.

### ముసోలీని గర్వం.

ఇటలీ వాడెవడైన దేశీయుని యింటిలో చొరబడి ఏపిల్లనైన తీసుకపోవచ్చును. తలిదండ్రులు వలదంటే వారిని చావ

తంటారు. కోర్టులో కేసుపడితే జడ్జి "ఇటలీ దేశీయుడు నీ కూతురిని వలచేడని నీవు గర్వించలేవా?" అని అడుగుతాడు. అని అతడు చెప్పెను. 16 సం॥ బాలికలు సుఖరోగాలతో బాధపడుతూవుంటారు. కాని వారికి చికిత్స లేదు. ఇపుడు బ్రిటిషువారు వచ్చి సివిలు ఆసుపత్రులు యేర్పాటు చేసేరు. కాని యీ దారుణ రోగాలు పోడానికి ఎన్నేండ్లో పట్టును. సీజరు వంశీయులు గత 40 సం॥ల నుండి పరిపాలిస్తున్న దేశంలో యిట్టి నాగరికత సభ్యత చూపుచున్నారు. అబిసీనియా ఆక్రమిస్తున్నపుడు, ఆదేశానికి నాగరికత నేర్పుతానని గొప్పలుచెప్పిన ముసోలీని వాక్యాలు నాకు జ్ఞప్తికి వచ్చాయి.

బ్రిటిషువారికి ఇటలీవారికిగల వ్యత్యాసం నాకప్పుడు స్పష్టంగా తెలిసింది. బ్రిటిషువారు నూరేండ్లపైగా మన దేశంలో ఉన్నారుకాని ఎన్నడు మన ఆడవారిని చెరచలేదు, మన ఆత్మగౌరవం చెడలేదని సగర్వంగా చెప్పగలను.

### ఒక పాఠం.

"ఇటలీవారికిగాని జర్మనీవారికిగాని బ్రిటిషువారికన్న ఎక్కువనీతి ఉందని మనం అనుకోరాదు. నేచూచిందాన్ని బట్టి వారంటే నాకు చాల అసహ్యం ద్వేషం కల్గుచున్నది. ఆత్మగౌరవం కాపాడుకోవాలంటే భారతీయులు బ్రిటిషువారినే కోరాలికాని వారినికాదని ఇతర దేశీయు లెవ్వరిని పాలకులుగా కోరరాదు. ఇరిట్రియాలో ఇటలీవారేమి చేసేరో మనం ఊహింపజాలం. నాగరికత, మానవ సౌభాగ్యంపేరిట దేశాన్ని ఆక్రమించి, దారిద్ర్యం అవినీతి దౌర్భాగ్యం ప్రసాదించిరి. తినుబండారంకన్న స్త్రీని చవుకగా నెంచిరి. ఇటలీ నాగరికత బ్రిటిషు నాగరికతకన్న మేలని ఎవ్వరు పొరబడరాదు. ముసోలీని తన సైనికుల దుస్తులు పరికరాలు మార్చగల్గెను కాని, వారి రక్తంలోనున్న పశుత్వం కామం మార్చలేకుండెను. సైన్యానికి జాతికి పెట్రోలు యంత్రాలుండిన చాలదు, నీతికూడా ఉండాలి."

# ఆయుధ ఉత్పత్తిగూర్చి చర్చిలు గారి ప్రకటన.

## ఇంతవరకు యుద్ధంలో లాభనష్టాలు.

బ్రిటిను యుద్ధ సప్లై శాఖ తగినంత సమర్థతతో పనిచేయ లేదని, అందున్న వివిధ అంతఃశాఖలకు పోటీయున్నదని అనేక విమర్శలు బయలుదేరినవి. కామన్సు సభలో ప్రధాన మంత్రి చర్చిలుగారుపన్యసిస్తు ఆ విమర్శలను నిందలను ఖండించిరి. వారు చెప్పిన విషయములలో యీ దిగువ ప్రధానాంశములు గలవు :—

1. ఇంగ్లాండు ఏకవ్యక్తి అధికారంక్రిందనున్న దేశం కాదు. యుద్ధ నిర్వహణమునందు మాత్రం ఏకనాయకత్వం గల సంస్థగ క్రమేణ పనిచేయుచున్నది.

2. పని గైకొనుటయందుగాని, ముడిపదార్థములను సంపాదించుటయందుగాని, యంత్రాగారములందు స్థలము యంత్రసామగ్రులను ఉపయోగించుటయందుగాని వివిధ ఉత్పత్తిశాఖలకు తమకే ముందు కావాలను తగవులు లేవు. అన్నిరకముల ఉత్పత్తి హెచ్చుచున్నది.

3. ఈ ఏడు విమానాల నిర్మాణమునందు క్రొత్త పోకళ్లు వచ్చినవి. జర్మనీ ఉత్పత్తికన్న మన ఉత్పత్తి నిరిటికన్న యీ యేడు చాల ఎక్కువగలదు.

4. డంకర్కు యుద్ధం పూర్వంకన్న గత మూడు నెలలో నేలఫిరంగులు రెండింతలు తయారుచేయబడినవి ; మందుగుండు 1½ వంతు హెచ్చెను. యుద్ధనౌకలు వర్తకనౌకల ఉత్పత్తి గత యుద్ధంలో ఏ మూడుమాసాలలో లేనంత ఎక్కువగ యీ మూడు నెలలో జరిగెను. విమానాలుగూడ చాల ఎక్కువగానే కట్టబడ్డాయి.

5. జర్మనీపైన 1,500 మైళ్ల దూరంనుండి పోయి బాంబులు వేయగల్గుచుంటిమి. అంతదూరం యిదివరకుకన్న రెండింతలు బరువు బాంబులు మోసుకపోగల బాంబరు విమానాలు తయారు చేయబడుచున్నవి. మరి మూడు నెలలలో అమెరికా సహాయంకూడ కలుపుకుంటే అంతకు రెట్టింపున్నూ, మరి ఆరు నెలలలో నాలుగింతలున్నూ తయారుచేయగలం.

6. ఇంగ్లాండులో పంటలు యీ యేడే అన్ని సంవత్సరాలకన్న ఎక్కువగా పండినవి.

7. యుద్ధం ప్రారంభమయి 21 నెలలయింది. ఈ కాలంలో అఖరు మూడు మాసములందు ఇంగ్లాండులో యుద్ధసామగ్రి ఉత్పత్తి గత యుద్ధంలో యిదే కాలంలోకంటె రెండింతలు ఎక్కువగ నున్నది. గత యుద్ధంలో మూడో ఏటు మూడు మాసాలలో అత్యధికోత్పత్తి జరిగెను. ఈ యుద్ధంలో రెండో ఏటనే ఎంత అధికం ఉత్పత్తి చేయబడెను ?

8. కార్మిక తగవులవలన ఎటువంటి పనీ ఇంగ్లాండులో ఎక్కడా నిలచిపోలేదు.

### ఇంతవరకు లాభాలు.

ఇంతవరకు కలిగిన లాభాలను చర్చిలుగారు యిట్లు క్రోడీకరించిరి :—

1. రష్యా ఎదురు తిరిగి తన అద్భుతశక్తితో నాజీ సైన్యాలను హతమార్చుచున్నది.

2. అమెరికా సంయుక్తరాష్ట్రముల సహాయం అధికమగుచున్నది. అమెరికా ఆగ్రహంకూడ చాల హెచ్చి యుద్ధంలో దిగుటకు ఘడియో క్షణమో యనియున్నది.

3. వాయుపథమున జర్మనుల ఆధిక్యత తొలగింపబడినది. ఇంగ్లాండుపై విమానదాడి ప్రస్తుతానికి నిలచిపోయింది.

4. అట్లాంటికుయుద్ధం యింకా ముగియలేదు, కాని అమెరికా ధర్మమా అని మిత్రమండలికి అనుకూలంగా సాగుచున్నది.

5. రెండు మూడు నెలల క్రిందటికన్న నైలులోయ ఎక్కువ భద్రముగ నుంది.

6. జర్మనీయొక్క భేషజం భీకరంకూడ పోయింది. నైతికబలంకూడ పోయి అధోగతినిపడింది.

### బ్రిటిషువారికి హెచ్చరిక.

ఇంగ్లాండుపై శత్రుదాడి తప్పిపోలేదని హెచ్చరిస్తు చర్చిలుగారిట్లు తెలిపిరి :—

1. జర్మనుల శక్తి యింకా యెక్కువగానే ఉంది.

2. వినాశకరమగు ఆయుధసామగ్రి చాల వశపరచుకొంది ; తయారుకూడా చేసింది.

3. దాని యుద్ధపరికరాలయుత్పత్తి యింకా చాల్ల ఎక్కువగ ఉంది.

4. జర్మనీవశమయియున్న పాలితప్రజల పరిస్థితులు యింతవరకు జర్మనీకి అనుకూలంగానేయున్నవి.

5. ఆదేశాలన్నింటి సంపద జర్మనీకి అందుబడిగానుంది.

"ఏడాదిపైగా మనం ఒంటరిగా పోరాడితిమి; మానవ కోటి అమూల్యహక్కులను ఒంటరిగ మనం రక్షించవలసియుండెను. ఇపుడు పరిస్థితులు చాల ప్రోత్సాహకరంగా మారిపోవచ్చును. కాని చివరకు మన బాధ్యతమాత్రం తగ్గలేదు. అది నిర్వహించుటకు మన సర్వశక్తులను, అవసరమయితే మన రక్తమంతయు ధారపోయవలసియుండును."

# బ్రిటనుకు చేసే సహాయంగూర్చి అమెరికా రాయబారి ప్రకటన.

ఇంగ్లాండుకి అమెరికాచేయు సహాయంగూర్చి హారీహాప్కిన్సుగారు గత ఆదివారంనాడు చాల ముఖ్యమగు ప్రకటన చేసేరు. ఈతడు అధ్యక్షుడు రూజువెల్టుగారిచే ప్రత్యేకముగా ఇంగ్లాండుకి పంపబడిన స్వంతరాయబారి. వివిధ రకముల సహాయంగూర్చి అతడిట్లు వివరించెను.

1. వేలకొలది విమానాలు అమెరికాలో తయారయినవి ఇంగ్లాండునకు అపుడే పంపబడినవి. నాల్గు ఇంజనుల బాంబరు విమానాలు వేలకొలది కట్టబడుచున్నవి. హిట్లరు తన ఫాక్టరీలను ఎంతదూరం తీసుకపోయినా వీటిబారినుండి తప్పించజాలడు.

2. అనేక వందల అమెరికను టాంకులు అపుడే ఇంగ్లాండులో వివిధ ప్రాంతములకు పంపబడినవి. ఇంకా ఎన్నో దారిలో నున్నవి.

3. సముద్రాలుదాటే నావకలు, చమురు నౌకలు ఇంగ్లాండున కొసంగబడినవి. ఆహారపదార్థాలు, చమురు, మందుగుండు రవానాకు తగినన్ని వర్తక నౌకలు నిర్మింపబడుచున్నవి.

4. బ్రిటిషు ఫాక్టరీలందు నేడు అమెరికా యంత్రాలు అమర్చబడి పనిచేయుచున్నవి.

5. ఇంగ్లాండునకు విశేషంగా ఆహార పదార్థములు పంపబడును. బ్రిటిషువారు ఆకలితో నుండుట అమెరికా సహించదు.

6. యుద్ధానికి పనికివచ్చు చిల్లర వస్తువులు అనేకవేలు పెట్రోలు మొదలు రోడ్డు మరమ్మతు సామానులవరకు, అపుడే ఇంగ్లాండునకు పంపబడినవి. అది దారిలోనున్నవి.

"మన వాక్స్వాతంత్ర్యం స్వేచ్ఛావిహార సాంప్రదాయం కాపాడుటకే యిదంతా చేస్తున్నాం. అమెరికా యుద్ధ నౌకలు ఉత్తరఅట్లాంటికులో ప్రవేశించుచున్నవి. విశాలమగు అట్లాంటికు మహాసముద్రం నేడు ఇంగ్లాండు అమెరికాల సఖ్యతయను వంతెనచే కట్టబడిన చిన్న కాల్వగ మారింది. అమెరికా ముఖ్యపట్నమగు వాషింగుటను, ఇంగ్లాండు ముఖ్యపట్నమగు లండనులను కలిపి బంధించిన స్నేహపాశము అగోచరమయ్యాను చాల ఘట్టిదైయున్నది. నాజీ దౌష్ట్యము దాన్ని త్రెంచజాలదు.

"ఇకముందు యీ రెండు దేశాల మధ్యదూరం మైళ్లతో లెక్కింపబడదు. డోవరుకు 21 మైళ్ల దగ్గరలో హున్ను (జర్మను) లున్నారు. అయినా, వారి చర్యలకు మన చర్యలకు ౭,000 మైళ్ల వ్యత్యాసం గలదు. మాదేశాన్ని మా జీవితాన్ని గూడ హిట్లరు బెదిరిస్తున్నాడని నాతోబాటు అమెరికనులందరు అనుకొనుచున్నారు. మీరు సాగించుచున్న యుద్ధం ప్రపంచమంతటి స్వాతంత్ర్యం కొరకైనది. అందుచే అది విఫలంకాదు" అని హాప్కిన్సుగారు లండనులో పలికిరి."

అధ్యక్షుడు రూజువెల్టుగారు తేలికగా బాసచేయువాడు కాడనియు, "మీరు ఒంటరిగా యుద్ధంచేయుట లేదనియు" ఆంగ్లేయులకు అమెరికను రాయబారి నచ్చ జెప్పెను.

# ఆఫ్రికాలో భారతీయ సైన్య ప్రతిభ.

ఆఫ్రికాలో వివిధ ప్రాంతములందలి యుద్ధమునందు భారతీయ సైన్యంలో గత డిశంబరు నుండి 1941 వ సం॥ జూలై 8 వ తేదీసరికి ౯,427 సైనికులు గాయపడుటో చనిపోవుటో జరిగెనని అధికారరీత్యా ప్రకటించబడెను. ఈ కాలమునందే మన సైన్యం లిబియా ఎడారి, సుడాను ఇరీట్రియాలందు మాత్రమే 213,000 శత్రు సైన్యమును నష్టపరచెను. అబిసీనియా సిరనైకాలందు యింకా ఎక్కువ మంది శత్రువులు పోయిరి. 1914-18 వ సం॥లో గత యుద్ధమునందు యిదేకాలమున భారతీయ సైన్యం 13,812 నష్టమయ్యెను. దానితో పోల్చిన యిది చాల తక్కువ. భారతీయ సైన్యంలో నష్టాల వివరాలు డిశంబరునుండి 1941 వ సం॥ జూలైవరకు యీ దిగువ రీతి గలవు:—

ఆఫీసరులు : చనిపోవుట 21 ; గాయపడుట 96 ; కనబడనివారు 17 ; ఖైదీలు 14.

సైనికులతో చేర్చి మొత్తం :—చనిపోవుట 759 ; గాయపడుట 4,367 ; కనబడనివారు 1,251 ; ఖైదీలు 40.

సిరియాలో నష్టాలుయిందు చేర్చబడలేదు. విషీ ప్రభుత్వం ఖైదీలుగ పట్టుకొన్నవారంతా, లేక వారిలో ఎక్కువ మంది తిరిగివచ్చునట్లు తెలియుచున్నది.

శత్రువుల నష్టం.

ఇదే కాలంలో బ్రిటిషు సైన్యముల సహాయంతో భారతీయ సైన్యం శత్రువులను చాల నష్టపెట్టెను. లిబియాలో 1,33,000 ఖైదీలు పట్టుబడిరి. కరేనులో 10,000 శత్రుసేన నష్టమయ్యెను. ఇతరచోట్ల యింకా చాల ఎక్కువ నష్టంకలిగెను. కావున సరిగా వారికెంత నష్టం కలిగిందో చెప్పడం కష్టం.

ఆఫ్రికాలో భారతీయ సేనలు చాల ఘనత సంపాదించుచున్నవి. శత్రువులకు వి ప్రక్కనుండీ సప్లైలు రాకుండ చేయుచున్నవి. అందుచే బాంబులు మందుగుండు ఖర్చులేకుండనే శత్రుసైన్యాలు తిండిలేక లొంగిపోవుచున్నవి. మూడు నెలల క్రిందట శత్రువు సిరనైకాలో అకస్మాతుగా వచ్చిపడినపుడు బ్రిటిషు సేన టాబ్రుకునుచేరి యితర సైన్యాలతో సంబంధంలేకుండా చేయబడినది. ఆ సైన్యం యింత కాలం జయప్రదంగా ఆ నగరాన్ని రక్షించుటేకాక, చిన్న చిన్న సైనిక దళములనుపంపి కాపలాకాయుచు శత్రువును చేరరాకుండ తరిమివేయగల్గెను.

సోలంవద్ద సరిహద్దు యుద్ధాలు మూడు జరిగినా ఫలితం తేలలేదు. వాటినిబట్టి మన సైన్యాలు శత్రువును విశ్రమించనట్లు చాటుమాటు యుద్ధాలుచేసి అలశ్యం చేస్తున్నారని తెలియగలదు.

బ్రిటీషువారి టాంకులు.



ముందునకు సాగిపోవాలని ఆజ్ఞాపింపబడ్డ వెంటనే యీ టాంకులను నడుపువారు తమ టాంకులనబడే చనముగల ఉక్కుకోటలలో పలికిపోవుచున్న దృశ్యము యిందు కానవగును.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## విమాన దాడులు.

జర్మనీయందలి ప్రధాన పారిశ్రామిక కేంద్రములగు మాన్హీం, ఫ్రాంకుఫర్టు నగరములపైనను, ఫ్రెంచికోస్తాయందలి లిహావ్రె రేవుపైనను, బ్రిటిషు విమానములు 23 వ తేది రాత్రి బ్రహ్మాండమగు దాడి జరిపెను. మాన్హీం నగరమున లేచిన పెద్ద అగ్నిజ్వాలలు అనేక మైళ్లదూరము కనిపించెను. బెథూన్‌పైకిగూడ కొన్ని బ్రిటిషు విమానములు దాడి జరుపగా, శత్రు విమానములు తీవ్రముగ ప్రతిఘటించెను. ఆ పోరాటమున 12 శత్రు విమానములు పడగొట్టబడెను. 5 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. 23, 24 వ తేదీలలో, బ్రిటిషు విమానములు, బ్రెస్టు, లాపాలెస్ రేవులయందున్న షారన్‌హార్స్టు, గ్నీసూ అను జర్మను క్రూయిజర్లపైనను, ప్రిన్సు యూజిన్ నౌకపైనను వందలకొలది బాంబులు వర్షించినవి. గ్నీసూ నౌకకు 7 బాంబులు తగిలెను. ఇదివరకే శిథిలమైయున్న షారన్‌హార్స్టుకు 5 బాంబులు తగిలెను. ఈ రెండు చోట్లనుగూడ శత్రు విమానములు తీవ్రముగ ప్రతిఘటించెను. కాని అవి అసంఖ్యాకములగు బ్రిటిషు విమానములను నిలువరింపజాలకపోయెను. ఈ పోరాటమున 23 జర్మను విమానములు పడగొట్టబడెను. 24 వ తేది రాత్రి జర్మనీయందలి కీలు, ఎండెన్ రేవులందలి నౌకానిర్మాణశాలలపైగూడ వేలకొలది బాంబుల అగ్నిగోళములు వర్షింపబడెను. 25 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు, జర్మనీలోని హాంబర్గు, హెనోవరు, బర్లిను నగరములపైన అత్యంత భయంకరమగు అగ్నివర్షము గురిపించెను. బెర్లినులోని ప్రజలు, ఇకమీద ఇంతకంటెను భీకరమగు దాడులు జరుగుటకిది ప్రారంభమని చాల భయపడుచున్నారు. ఈ దాడులలో బ్రిటిషు వైమానికులు అమెరికానుండి క్రొత్తగావచ్చిన "ఎగిరే కోటలు" (ఫ్లయింగ్ ఫోర్ట్రెసు) అను పెద్దపెద్ద విమానముల నుపయోగించుటకు ప్రారంభించిరి. 26 వ తేదిన ఎండెన్ రేవుపైన మరల చాల బాంబులు వర్షింపబడెను. 27 వ తేది రాత్రి వాతావరణము బాగుగ లేకపోవుటచే జర్మనీపై దాడులులేవు. అయినా ఫ్రెంచి తీరపు డంకర్కు రేవుమీద, విమానాశ్రయములమీద మాత్రము విమానములు విహరించి బాంబులు వేసినవి. మూడు శత్రువిమానములు ధ్వంస మొనర్పబడెను. ఒక బ్రిటిషు విమానము తిరిగి రాలేదు.

23 వ తేదిన, బ్రిటనుపై ఇదివరకుకంటె విస్తారముగ శత్రు విమానదాడులు జరిగెను కాని ఎక్కువ నష్టము గలుగలేదు. రెండు శత్రు విమానములు పడగొట్టబడెను. 24 వ తేదిన, అతి స్వల్పమగుదాడులు మాత్రమే జరిగెను. వాని వలన, ఏ మాత్రమును నష్టము కలుగలేదు. 26 వ తేదిన బ్రిటనుపై శత్రు విమాన దాడులు అత్యల్పముగ మాత్రమే జరిగెను. నఫోకు జిల్లా తీరమున మాత్రము కొన్ని బాంబులు పడెను. నష్టము మాత్రమేమియు గలుగలేదు.

32 రోజుల తరువాత, లండను నగరముపై 28 వ తేది ఉదయం జర్మను విమానములు తిరిగి దాడి సాగించి చాల బాంబులు వేసెను. దక్షిణతీరపు పట్టణములపైనగూడ విస్తారముగనే బాంబులు వర్షింపబడెను. కొంత జననష్టం కలిగింది. కాని యీ దాడి అంత తీవ్రమైనదని చెప్ప వీలులేదు. డోవరు జలసంధిమీద 27 వ తేది మధ్యాహ్నము పెద్ద విమానపోరాటము జరిగెను. ఒక శత్రు విమానము ధ్వంస

మొనర్పబడెను. 29 వ తేది ఉదయం ఆంగ్లియాలో తూర్పు భాగముమీద మాత్రము స్వల్పముగ బాంబులు పడెను. మంగళవారము రాత్రి మరికొన్ని విమానములు వచ్చినవిగాని సముద్రతీరపు జిల్లాలదాటి యెక్కువదూరము లోపలికి రాలేదు. బుధవారమునాడు అక్కడక్కడ బాంబులు పడెనుగాని ఎక్కడను యెక్కువ నష్టము గలుగలేదు.

రాత్రివేళల బాంబులను వేయుపద్ధతిని ఉభయపక్షములును వదలుకొనుటకుగాను జర్మనీతో ఒక యొడంబడిక గావించుకొనరాదాయని పార్లమెంటులో ఒక సభ్యుడు బ్రిటిషు ప్రభుత్వమునకు సూచించెను. మంత్రి అట్లీగారు దానికి సమాధానమొసగుచు తామట్టి యొడంబడికకు యేమాత్రము నంగీకరింపమని స్పష్టముగ దెలియజేసెను.

సంగ్రామారంభమునుండి 1941 వ సం॥ జూన్ నెలాఖరు వరకు మొత్తము 7,195 శత్రు విమానములు పడగొట్టబడెను. వీనిలో 3,566 బ్రిటను పైన, 56 నార్వేలోను, 324 ఐరోపాలోను, 957 పశ్చిమ రంగంలోను ధ్వంస మొనర్పబడెను.

## ఆఫ్రికా-మధ్య ధరా.

టొబ్రూకునందలి (ఉత్తర ఆఫ్రికా లిబియా) బ్రిటిషు సైన్యములు 24 వ తేది రాత్రి ముట్టడించియున్న శత్రు సైనిక పంక్తులపై ఆకస్మికముగబడి 3 మైళ్లదూరము చొచ్చుకొనిపోయి చాల నష్టముగలిగించెను. 27 వ తేదిన టొబ్రూకునందలి భారతీయ సైనికులుగూడ మరల, అటులనే ఆకస్మికముగ శత్రు సైనిక పంక్తులపైబడి చాలమందిని ఖైదీలుగా పట్టుకొనివచ్చిరి.

మధ్యధరా సముద్రమందలి పాంటలేరియా (ఇటాలియను) దీవి వద్ద ప్రయాణమొనర్చుచున్న శత్రు నౌకల జట్టుపై బ్రిటిషు విమానములు 23 వ తేదిన పెద్ద దాడిని సాగించి రెండు పెద్ద సప్లై నౌకలను (7,000 టన్నులు) ఒక మందుగుండు సామగ్రి నౌకను ముంచివేసెను. ఆ రోజుననే మరికొంత సేపటికి, మరియొక నూనె నౌక (7,000 టన్నులు) గూడ బాంబులుచే ముంచివేయబడెను.

మధ్యధరా సముద్రమున సైనికులను సప్లైలను గొనిపోవుచున్న బ్రిటిషు నౌకల జట్టు నౌకదానిని 27 వ తేదిన శత్రుల ఈ బోటులు యెదిర్చెను. ఈ దాడిలో "ఫియర్ లెస్" అను డిస్ట్రాయరు మునిగిపోయెను. మరియొక సప్లై నౌకకు దెబ్బలు తగిలెను. కాని అన్నియు సురక్షితముగ గమ్యస్థానమును చేరుకొనగల్గెను. ఒక ఈ బోటు ముంచివేయబడెను.

మాల్టాదీవి (బ్రిటిషు) పైన శుక్రవారమునాడు పెద్ద విమానయుద్ధము జరిగెను. అందు, 5 జర్మను విమానములు పడగొట్టబడెను వెలటారేవుపైకి చాల "ఈ" బోటులు కూడ ఆ రోజున దాడివచ్చెను. వానిలో 12 బోటులు ముంచి వేయబడెను.

అబిసీనియాలో గోండారు ప్రాంతమున వాల్ కెఫిట్ దుర్గమునందుండి యింకను ప్రతిఘటించుచున్న 10 వేల ఇటాలియను సైన్యమును బ్రిటిసు సైన్యములుచుట్టు ముట్టెను. ఈ సైన్యములకు ఆహారపదార్థము లందనీయకుండజేసి వానియంతట నవియే లొంగిపోవునట్లొనర్చుటకు బ్రిటిషు అధికారులు నిశ్చయించుకొనిరి.

లిబియాప్రాంత సముద్రమున ప్రయాణ మొనర్చుచున్న బ్రిటిషు నౌకలపైన శత్రు విమానములు 28 వ తేదిన పెద్ద దాడి సాగించెను. కాని బ్రిటిషు విమానములు వానిని యెదిర్చి చెల్లాచెదరుగావించెను.

బ్రిటిషు విమానములు 28 వ తేదిన సిసిలీ దీవియందలి ఇటాలియను విమానాశ్రయములపై తీవ్రమగు దాడి జరిపెను. అపుడు 34 ఇటాలియను విమానములు ధ్వంస మొనర్పబడెను.

## అమెరికా—అట్లాంటికు.

సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమువారు సముద్రతీర ప్రాంతముల రక్షణయేర్పాటులకు అదనముగ 2,440 లక్షల డాలరుల మంజూరుచేయు చట్టమును 24 వ తేదీని ఆమోదించిరి.

యుద్ధమున ప్రవేశింపవలదని సైనికులకు బోధించుచు సెనెటరు వీలరు మొదలగు "ఐసొలేషనిస్టులు" గావించుచున్న ప్రచారమును సంయుక్తరాష్ట్ర అధికారు లేమాత్రమును సహింపరని దేశీయాంగ కార్యదర్శి స్టిమ్సన్ గారు 23 వ తేదీన హెచ్చరించిరి.

సైనిక, విమాన, నౌకావళాభివృద్ధులకు 8 బిలియనుల డాలరుల వెచ్చించుటకు ఒక క్రొత్త కార్యక్రమమును, శాసనసభ స్థాయిసంఘమువారు శిఫార్సుచేసిరి. దీనిప్రకారము రోజుకు రెండు నౌకలు చొప్పున సంయుక్తరాష్ట్రముల రేవులలో నిర్మింపబడును.

బ్రేజిలు, బొలివియా, కొలంబియా రాష్ట్రములలో (దక్షిణ అమెరికా) నాజీ కుట్రలవలన విప్లవములు సంభవింపవచ్చునని సంయుక్తరాష్ట్ర ప్రధాన సేనాని మార్షలు గారు నుడివిరి. అర్జెంటైనా పోలీసువారు బోనో ఎయిర్సు నగరమున జర్మను రాయబారి కార్యాలయముపై దాడిదీసి, అచటనున్న నాజీపక్ష ప్రధానకార్యాలయమున చాల పత్రములను పట్టుకొనిరి.

బొలీవియాయందలి జర్మను రాయబారియగు వెండ్లరుగారు 24 వ తేదీన చిలియా రాష్ట్రమున ప్రవేశింపగా—అచటి అధికారు లాతనిని వెంటనే దేశమునుండి వెడలిపోవలసినదని యుత్తరువుగావించిరి.

సంయుక్తరాష్ట్ర నౌకాదళము 26 వ తేదీన పసిఫిక్ సముద్రమున హొనలూలుదీవులనుండి బయలుదేరి వెళ్లెను. ఈ యుద్ధనౌకలు దూరప్రాచ్యమునకు జనుచున్నవని తలంచుచున్నారు. రూజ్వెల్టు అధ్యక్షుడు ఫిలిప్పైనుదీవులకు గల 150 వేల సైనికులనుగూడ సంయుక్తరాష్ట్రముల సైన్యమున నొకభాగముగ ప్రకటించి, దూరప్రాచ్యము ప్రాంతములకు ప్రత్యేకముగ నొక సైనికశాఖ నొకదానిని నేర్పరచుటకు ఉత్తరువుచేసెను.

సమ్నరువెల్సుగారు 28 వ తేదిన ప్రసంగించుచు, దూరప్రాచ్యమున సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమును, బ్రిటిషు ప్రభుత్వమును ఒకేవిధమగు విధానములను కార్యక్రమములను అనుసరించుననియు అందుచే తరుచు ఉభయ ప్రభుత్వములును సంప్రదించుకొనుచుండుననియు ప్రకటించెను.

జూలై మూడవవారమున జరిగిన "గాల్లప్ పోలు"నందు ప్రజలలో నూటికి 37 వంతులు ఐరోపా, ఆసియా రంగములకు సంయుక్తరాష్ట్ర సైన్యములను పంపవచ్చుననిరి. 50 వంతులు వలదనిరి.

జపాను ఆస్తుల జప్తుచేయుటకు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము ఉత్తరువుగావించుటవలన, రేవులలోనికివచ్చిన పట్టుకొనెదరనుభయముతో 50 జపాను నౌకలు, అమెరికాకు దూరమున సముద్రముననే తిరుగుచుండెను. వీనిలో, చాలమంది అమెరికనులు ప్రయాణ మొనర్చుచున్న, టటమారు అను ప్రయాణీకుల నౌకకు మాత్రము, రేవులోకివచ్చి ప్రయాణికుల దింపి స్వేచ్ఛగ తిరిగి వెళ్లుటకు సంయుక్తరాష్ట్ర అధికారులు అనుమతి నొసగిరి.

సంయుక్తరాష్ట్రములో ధరలను హెచ్చకుండ నిలిపి యుంచుటకుగాను, ధరల నిర్ణయాధికారమును గోరుచు రూజ్వెల్టు అధ్యక్షుడు శాసన సభలలో నొక చట్టమును ప్రవేశ పెట్టించెను.

## రష్యా.

రష్యారంగమున, జర్మనులదాడి ఇంచుమించు నిరోధింపబడెనని రష్యనులు ప్రకటించుచున్నారు. తమదాడు లీవిధముగ భగ్నమగుటచే హిట్లరు దిగులుపడి, తన ప్రధాన సేనానియగు జెనరలు బ్రాటిష్‌గారిని, ప్రధాన సైనికాధికారియగు మార్షలు కీటెలుగారిని ఆపదవులనుండి తొలగించి, ఇతరపదవులకు మార్చివేసెననియు జర్మనీలో పరిపాలనాధికారమును నాజీపక్షనాయకుల తొలగించి తామే స్వాధీనపరచుకొనుటకు సైనికనాయకు లాలోచించుచున్నారనియు రష్యను అధికారులు దెలుపుచున్నారు.

24 వ తేదీన జర్మనీనుండి ఫిన్లండుకు సైనికులను ఆయుధసామగ్రిని తీసుకొనిపోవుచున్న 10 జర్మను నౌకలు బాల్టికు సముద్రములో రష్యను విమానములచే ముంచివేయబడెను. స్మొలెన్‌స్క్‌రంగమున జరుగుచున్న భయంకరమగు పోరాటమున క్రొత్తగవచ్చిన 5 వ జర్మను పదాతిదళము నామరూపములులేకుండ రష్యనులచే నిర్మూలింపబడెను.

దక్షిణరంగమున జర్మనులు 24 వ తేదీన ఒడెస్సా (నల్ల సముద్రము) రేవుపట్టణముపై విమానదాడి జరిపిరి. మాస్కోపైన 23 వ తేదీ రాత్రిగూడ విమానదాడి జరిగెను. కాని శత్రువిమానములు పట్టణముపైకి రాజాలక పరిసరములలోనే బాంబులువదలి పారిపోయెనని రష్యనులు ప్రకటించిరి.

ఖైదీలుగా చిక్కిన జర్మను సైనికులవద్ద—విషవాయు ప్రయోగమునకు సంబంధించిన సూచనలుగల పత్రములు దొరికెననియు, దానినిబట్టి జర్మనులు విషవాయువు నుపయోగింపదలచిరని తేలుచున్నదని రష్యా అధికారులు వెల్లడించిరి. జర్మను లీపత్రముల జారీచేసినమాట నిజమేనని అంగీకరించిరి కాని ఆపత్రములు సైనికులకు శిక్షణ నొసగుట కుద్దేశింపబడినవనియు, రష్యాలో ఉపయోగించుటకుగాదనియు, రష్యనులు విషవాయువు నుపయోగించుచో మాత్రము తాముగూడ తిరిగి ఉపయోగించెదమనియు ప్రకటించిరి.

ఉత్తర రంగమున (ఫిన్లండు) ఫిన్నిషు సైన్యములు వెనుకటి ప్రాత సరిహద్దులవరకు ఆక్రమించుకొనెననియు, కొన్నిచోట్ల రష్యాలోనికిగూడ 25 మైళ్ళ దూరము చొచ్చుకొనివెళ్ళిరనియు ఫిన్నిషు అధికారులు ప్రకటించిరి.

27 వ తేదీన స్మొలెన్‌స్క్ రంగమున జరిగిన పోరాటములో 2 జర్మను పదాతి డివిజనులు ఒక "టాంకు" ల డివిజను పూర్తిగ నిర్మూలింపబడెను. శనివారము రాత్రి మాస్కో నగరముపై జరిగిన విమాన దాడిలో రెండు శత్రు విమానములు కూల్చివేయబడెను.

రష్యా విదేశాంగ సహాయ మంత్రియగు లొజొవిస్కీగారు 27 వ తేదిన స్మొలెన్‌స్క్ పోరాటమున చాల జర్మను సైన్యము హతమైనదనియు, వేలకొలది ఖైదీలుగ పట్టుకొనబడిరనియు ప్రకటించెను.

స్మొలెన్‌స్క్ రంగముననే యింకను భయంకరమగు పోరాటములు జరుగుచున్నవనియు, 29 వ తేదీన కొన్ని ప్రదేశములనుండి జర్మనులు తరిమివేయబడిరనియు సోవియటు అధికారులు ప్రకటించిరి. జర్మనుల దాడి నిరోధింపబడెను కనుక కొలది రోజులలోనే రష్యనులు తామే జర్మనులపై దాడుల ప్రారంభింపవచ్చునని తలంచుచున్నారు. స్మొలెన్‌స్క్ వద్ద రష్యనుల చుట్టు ముట్టితిమనియు దానినుండి తప్పించుకొనుటకు రష్యనులు సాగించు దాడులన్నియు తిరుగ గొట్టబడెననియు జర్మనులు ప్రకటించిరి. మాస్కో - లెనిన్‌గ్రాడులపై దాడి విఫలమగుటచే యిక జర్మనులు యుక్రేనియా రాజధానియగు కీవు పట్టణముపై తమ శక్తిని కేంద్రీకరించెదరని యనుకొనుచున్నారు.

30 వ తేదిన లండనులో సోవియటు రష్యా ప్రతినిధులకును, పోలండు ప్రభుత్వ ప్రతినిధులకును ఒక యొడంబడిక జరిగెను. దానిలో—రష్యనులు 1939 వ సంవత్సరములో తామాక్రమించిన పోలండు ప్రాంతములను వదలుకొనుటకును, తమవద్ద ఖైదీలుగనున్న పోలిషు పౌరుల విడుదల చేయుటకును అంగీకరించిరి. రష్యాలోని పోలండు ప్రజలు జర్మనీతో పోరాడుటకు సైన్యముగ నేర్పడెను. ఈ యొడంబడికలపై సంతకములగావించు మహోత్సవమునకు చర్చిలు ప్రధాని అధ్యక్షత వహించెను. ఈ యొడంబడికవలన 5 లక్షల పోలీషు ప్రజలు 1 లక్ష పోలిషు సైనికులు విముక్తులగుదురు.

యుద్ధమున చాల బాగుగ పనికివచ్చు ఒక క్రొత్త ఆయుధమును కనిపెట్టి తయారుచేసినందుకుగాను స్టాలిను, కోస్టీవు అను నిపుణునకి 29 వ తేదిన పెద్ద సన్మానముగావించి బహూకరించెను.

## తటస్థ రాష్ట్రములు.

స్పెయిను ప్రభుత్వాధ్యక్షుడగు ఫ్రాంకోసేనాని, ఆంగ్ల-అమెరికా సంయుక్తరాష్ట్రముల వైఖరిని నిరసించి అక్సిసుపై అభిమానము గన్పరచుచు కావించిన ప్రసంగమునకు బ్రిటిషు విదేశాంగ మంత్రియగు ఈడెనుగారు పార్లమెంటులో సమాధాన మొసగుచు, స్పెయిను ప్రభుత్వము తన వైఖరిని మార్చుకొనినయెడల, బ్రిటిషు ప్రభుత్వమువారుద్దేశించిన ఆర్థిక సహాయమును రద్దు చేసుకొనవలసియుండునని హెచ్చరించిరి. స్పెయిను ప్రభుత్వమువారింతవరకు రష్యాపై పోరాటమున పాల్గొనుటకు 90 వేల సైన్యము నంపిరనియు, ఇంకను పంపనున్నారనియు ప్రకటింపబడెను.

గురువారము రోజున శత్రు విమానములు అలస్టరుపై బాంబులు వేసెను. ఆ రోజుననే ఐర్లండుపైనగూడ నొకచోట బాంబులుపడెను. కాని వానిని యేదేశపు విమానము వేసెనో గుర్తింపబడలేదు.

## టర్కీ—ఈరాక్—ఈరాన్.

టర్కీలోని తూర్పు థ్రేసు సరిహద్దు దుర్గములపై 23 వ తేదీన ఏదో విమానము విహరించుచుండగా టర్కీ సైనికులు పలుమారులు హెచ్చరించిరి. తుదకు ఫిరంగి గుండ్లతో పడగొట్టిరి. పరీక్షింపగా నది జర్మను విమానమని గుర్తింపబడెను. బెస్సరేబియా ప్రాంతమున జరుగుచున్న యుద్ధమున పట్టుకొనబడిన పత్రములలో—జర్మనులు టర్కీపై దాడి సల్పుటకేర్పరుచుకొనిన ప్లానులు పట్టుబడెనని రష్యా అధికారులు వెల్లడించిరి. టర్కీ అధికారులు వీనికి ప్రాముఖ్య మొసగుటలేదు. టర్కీని జర్మనులు వత్తిడి చేయుచున్నారను వదంతులు నిరాధారమైనవని టర్కిషు అధికారులు దెలిపిరి.

బల్గేరియాలోని కొన్ని పట్టణములమీద 23 వ తేదీన రష్యను విమానములు బాంబులు వేసెనని బల్గేరియా అధికారులు ప్రకటించిరి.

టర్కీ కూడల ఆక్రమణోద్దేశము తమకేమాత్రమును లేదని టర్కీకి నచ్చజెప్పుటకుగాను రష్యా ప్రభుత్వమువారు తిరిగి వాగ్దానము లొనర్చుట కుద్దేశించుచున్నారు.

ఈరాక్‌లో ప్రస్తుతము చాలమంది జర్మనుల నివసింప నిచ్చుచున్నారనియు, అది చాల ప్రమాదకరమని ఈరాక్ ప్రభుత్వమును హెచ్చరించితిమనియు బ్రిటిషు ప్రభుత్వ విదేశాంగ మంత్రి ఈడెనుగారు 29 వ తేదిన పార్లమెంటులో వెల్లడించిరి. ఈ సందర్భమున జర్మను ఏజెంటులపై ఈరాక్ ప్రభుత్వము తగుచర్య దీసుకొనునని తలంచుచున్నారు.

ఈరాక్ రేవులలోనున్న మూడు జర్మను నావలు హిందూ సముద్రమున ప్రవేశించి బ్రిటిషు వర్తక నౌకలపై దాడులు సాగించుటకు ప్రయత్నింపనున్నవని తెలియుచున్నది.

### విషీ.

విషీ ప్రభుత్వ మంత్రివర్గము 26 వ తేదీన సమావేశమై, ఇండో-చైనా విషయమున జపానుతో యేర్పాటుల చర్చించెను.

### నౌకా నష్టములు.

21 వ తేదీన అమెరికానుండి బ్రిటనుకు రెడ్‌క్రాస్ వైద్యులను, "నర్సు"లను కొనిపోవుచున్న "విగ్రీడ్" అను నార్వేదేశపు నౌక అట్లాంటికు సముద్రములో ముంచివేయబడెను.

24 వ తేదీన బ్రిటిషు విమానములు నార్వే ప్రాంతపు సముద్రములో ఒక శత్రుల నూనె నౌకను (1,500 టన్నులు) ఒక స్లై నౌకను (7[illegible]0 టన్నులు) ముంచివేసెను.

26 వ తేదీన 'ఎర్లాంజన్' (6,101 టన్నులు) అను జర్మను నౌక దక్షిణ అమెరికానుండి దిగ్బంధనమును భేదించుకొనిపోవుటకు ప్రయత్నింపగా, అట్లాంటికు దక్షిణ భాగమున బ్రిటిషు నౌకలచే పట్టుకొనబడెను.

### దూరప్రాచ్యము.

ఇండో-చైనాలో సైన్యములను, విమానములను, యుద్ధ నౌకాదళమును నిలిపియుంచుకొనుటకు జపాను అధికారులు కోరిన షరతులకు విషీ ప్రభుత్వము 20 వ తేదీన అంగీకరించెను.

డచ్చి ఇండియా దీవులకువలెనే ఇండో-చైనాకుగూడ బ్రిటిషు అమెరికా అధికారులు రక్షణమును వాగ్దాన మొనర్చిరి. కాని ఇండో-చైనా అధికారులందుకు సమాధాన మొసగలేదు. ఇండో-చైనాను ఫ్రెంచి, జపాను సైన్యములు రెండును కలసి సమష్టిగ రక్షించుట కేర్పరుచుకొనుచు జపాను ఇండో-చైనా అధికారులు ప్రకటన గావించిరి. దాని ననుసరించి జపాను విమానములు, యుద్ధనౌకలు, సైన్యములు దక్షిణ ఇండో-చైనాలో దిగుటకు 27 వ తేదిన ప్రారంభించెను. 29 వ తేదికి ఆక్రమణ పూర్తియైనది.

ఇండో-చైనాలో జపాను దురాక్రమణకు ప్రతీకారముగ సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము తమదేశమునందున్న జపానీయుల నిలువ సొమ్ములను, ఆస్తులను 26 వ తేదిన జప్తుచేసిరి. రేవులలోనున్న జపాను నౌకలు కదలరాదని యుత్తరువు గావించిరి. బ్రిటిషు ప్రభుత్వమును, కెనడా, దక్షిణాఫ్రికా, ఇండియా, ఆస్ట్రేలియా, న్యూజిలండు దేశముల ప్రభుత్వములగూడ ఆటులనే జపాను ఆస్తులపై జప్తు ఉత్తరువుల గావించిరి. ఆస్ట్రేలియా ప్రభుత్వము మాత్రమే జప్తు ఆస్ట్రేలియా రేవులలోని జపాను నౌకలకు వర్తింపదని స్పష్టపరిచెను. జపాను ఆస్తులతోబాటు చైనా ప్రభుత్వపు కోరికపైన చైనీయుల ఆస్తులుగూడ జప్తుచేయబడెను దీనికి ప్రతీకారముగ జపాను ప్రభుత్వము తన దేశమునందలి బ్రిటిషు, అమెరికను ఆస్తులను జప్తుచేసెను. వీనివలన సంయుక్తరాష్ట్రములోవున్న 1,310 లక్షల డాలరుల జపాను సొమ్ము స్తంభించిపోవును. జపానులోవున్న 21,700 లక్షల డాలర్ల అమెరికను ఆస్తి స్తంభించును.

అమెరికా బ్రిటిషు రేవులలో ప్రవేశింపకుండ వేరుమార్గముగ రావలసినదని జపాను అధికారులు తమదేశపు నౌకలకు వుత్తరువుల గావించిరి.

బ్రిటను సామ్రాజ్యదేశములు జపానుతో గావించుకొనియున్న వర్తకపు ఒడంబడికలగూడ రద్దుచేసుకొనినట్లు బ్రిటిషు అధికారులు నోటీసు నొసగిరి.

జపాను ప్రభుత్వము సయామునందుగూడ, నౌకా విమానాశ్రయములను, సైన్యముల దింపుకొనుటకు దుర్గములను గోరుచు షరతుల నంపిరని వదంతులుగనున్నది. కాని సయాము ప్రభుత్వముమాత్రము వానిని ధృవపరుపలేదు. బ్రిటనుకు సయామునకు విభేదములు గలవను యారోపణలన్నియు అబద్ధములే.

ఈ నెల 29 వ తేదినాటికి జపాను రష్యా సరిహద్దుకు అపారమగు సైన్యమును కేంద్రీకరించినదనియు, సోవియటు సరిహద్దులలో రక్షణ దుర్గ నిర్మాణములకు 50 వేల చైనీయ పాటక జనులచే నిర్బంధముగ పని చేయించుచున్నారనియు దెలియుచున్నది.

29 వ తేదిన చుంకింగుపైన జపాను విమానములు పెద్ద దాడిని సాగించెను. కొన్ని బాంబులు టుటిల అను సంయుక్తరాష్ట్రంవారి చిన్న యుద్ధ నౌకకు తగిలి నష్టము గలిగించెను. సోవియటు రష్యా రాయబారి కార్యాలయములకుగూడ బాంబులు తగిలి శిథిలమైనవి.

డచ్చి తూర్పు ఇండియా దీవుల ప్రభుత్వమువారు, జపానుకు నూనె సప్లై చేయుట కిదివరకు గావించుకొనబడిన ఒడంబడిక రద్దయినదనియు, ఇకమీద ప్రభుత్వమువారి అనుమతి లేకుండ జపానుతో వాణిజ్యము జరుగరాదనియు 29 వ తేదిన ప్రకటించిరి.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.